To

MY BROTHER

Late Mr. Kolichina Appayya
Deekshitulu B. A.

*District Court Vakil, Masulipatam.*

AS A TOKEN OF

AFFECTION, ESTEEM AND GRATITUDE

*This book is dedicated by*

G. RAGHAVA DEEKSHITULU.

(Author)

*Teacher A. E. L. M. Training School*

*for Mistresses, Guntur.*

1915.



శ్రీరస్తు

# శుశ్రూష

## మొదటి ప్రకరణము.

సూ. రా:—ఈపుస్తకము నందు ప్రత్యేకముగఁ జెప్పఁబడిన చోటులయందుఁ దప్ప తక్కిన చోట్లనెల్ల బాలునకుఁ జెప్పఁబడినది బాలికకునుకూడ వర్తింపఁ జేసికొనవలయును. సౌలభ్యముకొఱకుఁ బెక్కుచోట్ల బాలుఁడని యే వాడియున్నారు. విద్యార్థి శబ్దమును నిట్లే.

---

విద్యార్థుల తలిదండ్రులకు లేక సంరక్షకులకు, మఱియు వారి యోగక్షేమములఁ గోరువా

నెల్లరకుఁ దెలియఁజేయుట యేమనఁగా:—

ఉపాధ్యాయుఁడు బాలురు పాఠముగఁజదివి బాలురు సక్రమముగా చేయుచున్నారో లేదో గమనించుచుండవలెను. బాలురయం దేవిధమైన పొరపాటు, లేక తప్పిదము కనఁబడినను, లేక ఇతరుల వల్ల కొంపవినను ఎంతమాత్రము నశ్రద్ధచేయక అందువలనఁగలుగు నష్టమును వారికి మనమునఁ బట్టునట్లు బోధించి చెప్పవలెను. ఇట్టి విషయములలోను బాలునికొట్టి శిక్షించుటచే సన్మార్గమునకుఁ ద్రిప్పవచ్చునని యనుకొనరాదు. శిక్షకంటె బోధ యెక్కువ పనిచేయును. తప్పిదమునకు బాలుఁడు పశ్చాత్తాపముచేత ఏడ్చునట్లు చేసినచో మేలుకలుగునుగాని దెబ్బలుకొట్టి నొప్పిచేత ఏడ్చునట్లు చేసిన లాభము లేదు. బాలురయొక్క శ్రేయస్సును గోరుకొను పెద్దలును బాలుర యభివృద్ధికొర కుపాధ్యాయులతో సహకరించి పనిచేయుట మిగుల అవసరము.

ఎవరిపిల్లలనువారు గారాబముగఁ బెంచుకొనుచుండెదరు. న్యాయమే. కానిపిల్ల కారీవముద్దు. గారాబము పెట్టుపోతలలోఁ జూపవలయును. బాలునియందుఁగల దుష్ప్రవర్తనమును దిద్దక ముద్దు చేయుటమాత్రము ముందువృద్ధిలోనికి రావలసిన బాలురకుఁ జేచేత విషము త్రాగించుటయేగాని ప్రేమఁజూపుటమాత్రముగాదు. వ్యాధికలిగినపుడు పథ్యముచేయలేదని మందునీయకమాను దయార్ద్రహృదయులుందురా?

కనుక బాలురయందలి తప్పిదములను మఱుగుపఱచుట గారాబముఁ జూపక వెంటనే దిద్దవలయును. బాలుర యభివృద్ధివిషయమై తలిదండ్రులే పట్టువిడచినచో 'కందకులేని దురద చేమకేల' యనునట్లుపాధ్యాయులకు మాత్రమేమాత్ర మాళ్లి మీఁద గంజయొలిగినది? వారికి బాలురమీఁద శ్రద్ధ వబాంధవ్యముఁ గలుగును? నూటికొక యుపాధ్యాయుఁడు శ్రద్ధవహించినను తలిదండ్రులతో

డ్పాటు లేనిది పిల్లలు బాగుపడుట దుర్లభము. చదు వంటదు. సత్ప్రవర్తన కుదురదు. కనుక బాలుర విషయమై తలిదండ్రాదులు నుపాధ్యాయుడును గలిసి పనిచేయవలెను.

బాలురు బలవంతపెట్టినంత మాత్రమునం గాని, ఏడ్చినంత మాత్రమునం గాని తలిదండ్రాదు లుపాధ్యాయుల కబద్ధపుచీట్లు వ్రాయరాదు. బాలు రకుం దగిన యోగ్యత లేనపుడు పైతరగతిలోనికి వేసి కొనుడని తలిదండ్రాదు లుపాధ్యాయులను, పాఠ శాలాధికారులను కోయుంబవట్లు వెంటంబడి దీనా లాపములచే వేధించుటకంటె మొదటినుండియుం బిల్లలచేత శ్రద్ధగాం జదివించుట యుత్తమము. క్షేమకరము. గౌరవము.

## రెండవ ప్రకరణము.

1 బడియున్న దినములన్నియు తప్పకుండ ప్రతి పూంటను వేళమించకుండ హాజరయ్యెదను.

2 ఇంటియొద్ద పెద్దవారు ఉంచుమని చెప్పినప్పుడు ఉపాధ్యాయుని యొద్దకు వచ్చి సెలవు పుచ్చుకొని వెళ్ళెదను.

3 జబ్బుచేత రాజాలక పోయిన యెడల, వచ్చినపుడు పెద్దవారియొద్దనుండి సెలవుచీటి తెచ్చెదను.

4 ఆలస్యముగ వచ్చిన నాడు ఇంటియొద్దగల పెద్ద వారిచేత చీటీని వ్రాయించుకొని వచ్చెదను.

5 ఏపూట పాఠములు ఆపూట తప్పకుండ గట్టిగ చదువుకొని వచ్చెదను.

6 నేను బడికి రానిసమయమున నాతరగతిలో జరిగిన పాఠములు, ఇయ్యబడిన లెక్కలు మొదలయినవాని నాతరగతి బాలుర నడిగి తెలిసికొని, నేర్చుకొనవలసినవాని నేర్చుకొని, వ్రాయవలసిన పాఠములు, కాపీలు, లెక్కలు మొదలయిన వానిని వ్రాసికొని పాఠశాలకు వచ్చెదను. అట్టి పాఠములు నాకు రావనిగాని వానిని చెప్పినపుడు నేను తరగతియందు లేననిగాని అనను.

7 ఇంటియొద్దఁ జదువుకొనుటకును వ్రాసికొనుట
కును వీలులేనియెడల ఆసంగతి ఇంటియొద్ద పెద్దల
వల్ల ఉత్తరము వ్రాయించుకొని వచ్చెదను.
8 ఇంటికొద్దకు ఇచ్చిన లెక్కలు మొదలైనవానిని
నేను స్వంతముగఁ బ్రయత్నము చేసెదను.
9 నాకుఁ దెలియని యెడల ఇతరులను గాని ఉపా
ధ్యాయునిగాని అడిగి నేర్చుకొనెదను. ఇతరుల
యొద్ద నేర్చుకొనినపుడు ఆసంగతి తరగతిలోనికి
రాగనే ఉపాధ్యాయునితో ముందుగాఁ జెప్పెదను.
10 బడిలోఁగాని బయటఁగాని ఎన్నడును 'కాపీ'
చేయను.
11 ఇతరులు నన్నేపాఠమైనను అడిగినపుడు వారికిఁ
జెప్పి ఆసంగతి యుపాధ్యాయునితోఁ దరగతి
లోనికి రాగనే చెప్పెదను.
12 నాచేతనైనంతవఱకు ఇతరులకు మంచివిషయ
ములలో సహాయము చేయుదును. బద్ధకించను.
13 పెద్దవారికిఁ గోపమువచ్చుపనులెప్పుడును చేయను.

14 వారికంటెఁ బెద్దవారితో మాటలాడు నపుడు మర్యాదగ, నిదానముగ మాటలాడుదును.

15 ఎవరితోను అబద్ధము లాడను.

16 వారికంటెఁ బెద్దవారికి మనస్సు విసుగు పను లెవ్వియును చేయను.

17 ఎవరిని గురించియు చాటునఁగాని ఎదుటఁ గాని దూషణగా మాటలాడను.

18 కాలము వ్యర్థముగాఁ గడపను.

19 వారికంటెఁ బెద్దవారు వలదనినపని నెప్పుడును చేయను.

20 తరగతియందున్నపుడు ఇతర బాలురతో నెప్పుడును మాటలాడను.

21 కాగితములు మొదలయినవి చించి తరగతియం దెప్పుడును క్రిందఁ బారవేయను.

22 గోడలమీఁదను తలుపులమీఁదను ఏమియు వ్రాయను.

23 ప్రతిదినమును తప్పక స్నానము చేయుదును.

24 మాసిన గుడ్డలను ధరింపను.

25 వీధిలో ఎప్పుడును పరుగెత్తను.

26 వీధిలో ఎప్పుడును కేకలువేయను.

27 మా యింటియొద్ద తప్ప వీధిలో ఎప్పుడును ఆడు కొనను.

28 పెద్దవారు చెంత లేనప్పుడును, వారు చెప్పనప్పుడును ఎత్తుప్రదేశములకు ఎక్కను.

29 ఇతరుల వస్తువులను దొంగిలింపను.

30 ఇతరుల వస్తువులలో దేనినైనను పడిపోవువానిని నాయొద్ద నుంచుకొనను. అట్టివానిని సొంతదారునకైన ప్రాకను

31 రాత్రి నిద్రపోవుటకు ముందును ఉదయము నిద్రలేచిన తరుణమును దేవునితప్పక ప్రార్థించెదను.

32 నా పుస్తకములను మాపను.

33 కాగితములలో అనవసరమయిన గీతలను గీయను.

34 నా పుస్తకములలో, ఉపాధ్యాయులు చెప్పనిదే
దియు వ్రాయను.

35 బడికి సంబంధించిన వస్తువులలో ఉపాధ్యా
యుడు చెప్పనిదే వస్తువను కొనను.

36 గోళ్లు కొరుకను.

37 పెద్దగొంతుకతో మాటలాడను.

38 నాకంటె పెద్దవారితో మాటలాడునపుడు
పడుకొని మాటలాడను.

39 పెద్దలు వచ్చినపుడు పడుకొని యుండను.

40 పెద్దలు రాగనే లేచి నిలుచుండి మర్యాదగ
మాటలాడెదను.

41 బ్రాహ్మణ ఉపాధ్యాయులు కనబడగనే నమ
స్కారము చేయుదును. తక్కిన యుపాధ్యాయు
లకు సలాము చేయుదును.

42 తరగతిలోనికి ఉపాధ్యాయులు రాగనే లేచి
నిలుచుండి మర్యాదచేసెదను. వారుకూర్చొను
మని చెప్పవలెనుగాని, వారుకూర్చొనువఱకుఁ

గాని కూర్చొనను.

43 స్టాకింగులు బూట్సు తొడుగుకొనినపుడు తప్ప సాధారణపు చెప్పులు తొడుగుకొని నపుడు వానితో తరగతిలోఁ గూర్చొనను.

44 ఉపాధ్యాయుల నడుగకుండ తరగతి విడిచి వెళ్ళను.

45 ఎచటను ఉమ్మివేయను

46 చూచువారికి అసహ్యకరమైన పనులను చేయను.

47 పెద్దలయెదుట నములుచు కూర్చొనను.

48 పెద్దలతో నములుచు మాటలాడను.

49 కుచ్చువిడిచి తలగుడ్డ చుట్టుకొనను.

50 కోటునకు గుండీలు పెట్టకుండ విడువను.

51 అందఱను ప్రేమింతును.

52 ఎవరిమీఁదను చాడీలు చెప్పను.

53 ఏజంతువులకును బాధకలుగఁజేయు పనులను చేయను.

54 పొడుము, చుట్ట, బీడి, సిగరెట్ మొదలగుదుర

ధ్యానములు చేసికొనను.

55 చీట్లాట, పులిజూదము మొదలగుఆటలనాడను.

56 చాకలివారికు వస్తువులను విడచి వెలగల వానిని కొనను.

57 ఎవరివద్దను అప్పుతీయను.

58 మీటింగులు మొదలగుచోట్లకు వెళ్లినపుడు ఏవిధమైన అల్లరియు చేయను.

59 మీటింగులోఁ జెప్పఁబడు విషయములునాకుఁ దెలియవని యెంచుకొనియున్నపుడు ఆమీటింగు లోనికి పోను.

60 పొరపాటున వెళ్ళిన యెడల ఒకరియుపన్యాసము మధ్యగా లేచిరాను.

61 నాకంటెఁ బెద్దవారు మాటలాడుచుండగా నన్ను అడుగనిదే జోక్యము కలిగించుకొనను.

62 ఎవ్వరును ఒట్టుపెట్టుకొనను.

63 పేదవాండ్రకు, కుంటివాండ్రకు, గ్రుడ్డివాండ్రకు నాచేతనైన సహాయము చేయుచుందును.

64 మడఁచుటకు వీలులేనికత్తులు, కలములు,
మేకులు మొదలగువానిని జేబులలో నుంచు
కొనను.

65 ఇతరుల పోట్లాటను వినను.

66 ఇతరులను మోసముచేయను.

67 ఇతరుల ఉత్తరములను, డైరీలను, పద్దుపుస్తక
ములను వారియనుమతిలేనిది చదువను.

68 నాశరీరమునకు దెబ్బతగులునట్టియు, నాయొద్ద
గాని చుట్టుప్రక్కలగాని ఉండువస్తువులు చెడి
పోవునట్టియు పనులను చేయను.

69 చెఱువులు, బావులు, నదులు, కోనేళ్ళు మొద
లగువానిలో ఎప్పుడును దిగను.

70 ఆవులు, ఎద్దులు, గేదెలు, గుఱ్ఱములు మొదలగు
వానియొద్ద కెప్పుడునుపోను.

71 చెడ్డపిల్లలతో సహవాసముచేయను.

72 మాఅమ్మగారియెదుటగాని మాఅప్ప చెల్లెండ్ర
ఎదుటగాని ఉచ్చరింపఁగూడని మాటలను ఎక్క

టను ఉచ్చరింపను.

73 నాపలకలను పుస్తకములను, పెన్సిళ్లను, కల ములను, మిగులజాగ్రతగానుంచుకొనెదను. శు భ్రముగనుంచుకొనెదను.

74 ఆఁకలి కానిదెప్పుడును భుజింపను. కావలసిన దానికంటె యెప్పుడును ఎక్కువతినను.

75 అన్నివిధములచేతను మంచిపేరు తెచ్చుకొనుట కుఁ బ్రయత్నించెదను.

---

## మూఁడవ ప్రకరణము.

---

ఉపాధ్యాయులారా,

మనము కేవలము 'నిజదారసుతోదర పోష ణార్థమై' యుద్యోగములుచేయుచున్నామని తలఁ పకుఁడు. మన మొక మేనేజర్లకే కాదు, పాఠశాల యందలిబాలురకందఱకును సేవకులము. మనవల్ల విద్యావిషయికమైన పనిపుచ్చుకొనుటకుఁ బ్రతి విద్యార్థిని హక్కుకలదు.

బాలురకుఁ జదువు, వ్రాఁత, లెక్కలు, భూగోళము మొదలగుపాఠములను నేర్పినంతమాత్ర మున మనవిధాయకకృత్యము నెరవేరినదని సంత సింపరాదు. బాలుర నన్నివిధములఁ సన్మార్గప్రవర్త కులుగా నొనర్చుభారమునందొక సగము తలిదండ్రు లమీఁదను మఱియొకసగముపాధ్యాయులమీఁద ను నాధారపడియున్నది. బాలుర తలిదండ్రులు గ్రామాంతరముల నుండిరేని యారెండు సగభాగ ముల భారమును ఒకయుపాధ్యాయుని మీఁదనే నాధారపడియుండును. మనుజుఁ డెంత విద్వాంసుఁ డైనను సద్గుణములలవడ వేని యాతనికా విద్యవలనఁ గలుగవలసిన సంపూర్ణఫలము కలుగలేదని తలంచవలయును.

కొందఱు బాలురు తమ తలిదండ్రుల యెదుటను, తమతరగతి యుపాధ్యాయులయెదుటను చక్కగనేయుండి, ఇతరుల యెదుట దుష్టకార్యముల ను (చుట్టలు, బీడిలు, సిగరెట్లు మొదలగునవి త్రాగు

మంచివారు పదిమందియుండినఁ జాలును. చెప్ప వలసినచో నెప్పినఁ జెప్పితి నేగాని కుమారులయందలి దుర్మార్గమును సూన్పవలదని చెప్పు తలిదండ్రు లుందురా?

శరీరమునకుఁ దల యెంత ముఖ్యమైన అంగమో, పాఠశాలకుఁ గ్రమశిక్షయు నంతిముఖ్యమైనయంగము. క్రమశిక్ష (Discipline) లేని యెడల నుపాధ్యాయుఁ డెంత తెలివికలిగి బోధించినను, ఎంత శ్రమచేసి చెప్పినను బూడిదలో హోమము చేసినట్లుగాని లాభమేమియు లేదు. కనుక పాఠశాలయందుఁ గ్రమశిక్షను చక్కఁగాఁ గాపాడవలెను. మఱువకుఁడు. అశ్రద్ధచేయకుఁడు. ఉద్ధరింపకుఁడు. సర్వజనా సుఖినోభవంతు.

## నాలుగవ ప్రకరణము.

బాలురను సన్మార్గమునకుఁ ద్రిప్పుటకుఁ గొన్ని సూచనలు:—

1 ఉపాధ్యాయులు విద్యార్థులచేత డైరీ వ్రాయిం
చు చుండవలెను. వారమున కొకతడవయైన
వాడైరీలను తాముచదివి సంతకములను చేయు
చుండవలెను.

2 విద్యార్థులయొద్ద ప్రత్యేకమైన నోటుబుక్కులు
ఉంచి వానిలో నతని నడతను గుఱించి గౌర
వస్థులచేత నప్పుడప్పుడు వ్రాయించుకొని వచ్చు
చుండునట్లు చేయవలెను. ముఖ్యముగా నీ
టింగులందలి పెద్దమనుష్యులచే వ్రాయించు
కొని వచ్చునట్లు చేయవలెను. వానినప్పుడప్పు
డుపాధ్యాయులు చదివి సంతకములు చేయు
చుండవలెను.

3 విద్యార్థులలో మైనర్లు ఒంటిరిగా ప్రయాణము చే
యునప్పుడుపాధ్యాయుని యొద్దనుండిగాని లేకతలి
దండ్రాదుల యొద్దనుండిగాని అధికార పత్రము
పొందియుండవలెను. ఆఅధికారపత్ర మడిగిన గౌ
రవస్థులకుఁజూపుచుండవలెను. ఇట్లుచేయుటచేత

